Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ డిసంబరు నెల 11 వ తేది శుక్రవారం [నె 49 రు.





పడిపోయిన జర్మను విమానం.

రష్యా ఫిరంగులచే క్రింద పడి కాలుచున్నది. దాని మంటలు రష్యా వైమానికుల కీర్తిని వెదజల్లుచున్నవి.



## మిత్రమండలి విజయం సమీపిస్తున్నది - - - - - కాని ఘోరయుద్ధం ముందు జరుగనుంది.

### చర్చిల్ ప్రధాని ఉపన్యాసం.

బ్రిటిషు ప్రధానమంత్రి చర్చిలుగారు 5 వ తేదీన ఉత్తర ఇంగ్లాండులో కొన్ని కర్మాగారాలను చూచివచ్చిన పిదప, యుద్ధగతిని గూర్చి ఉపన్యసిస్తు యిట్లు చెప్పేరు :—

"యుద్ధం చాల తీవ్రరూపానికి వస్తున్నది. నాజీల నిరోధశక్తి క్రూరత్వం మోసం యింకను ధ్వంసం కాలేదు. మనం మనశక్తులన్ని కూడదీసుకోవాలి. తీవ్రంగా పోరాడాలి. మధ్యలో అనుకోకుండా మంచివార్తలేమయినా వస్తే సంతోషించవలసిందే కాని అంతతో తృప్తిచెందరాదు. మన కుడిచేతిబలం, కష్టాలకోర్చే ధైర్యమయిన గుండెపైనే మనం ఆధారపడియుండాలి. ఇంతవరకు స్వదేశంలోగాని, విదేశ యుద్ధరంగాలందు గాని యీ ధైర్య సాహసాలు తగ్గిపోలేదు. ఈ స్వల్పమగు సుగుణాలు యీ దీవిలోనివారు ఎన్నోతరాలనుండి అలవరచుకొన్నారు. ఈ సుగుణాలవల్లనే మన కష్టాలు కడతేరగలవు.

ఉత్తరాఫ్రికాలో యుద్ధం గూర్చి తెల్పుచు అట్లాంటికు సముద్రంనుండి తమ సేనలు 900 మైళ్ల ఆఫ్రికాలో తూర్పునకు చొచ్చుకొనిపోయినవి, కాని యింకను కొద్ది మైళ్ల మిగిలియున్నవి. అచటనే తీవ్రమగు యుద్ధం జరుగుచున్నది, అవి గెలిచినచో శత్రువుని పూర్తిగ ఓడించి ఆఫ్రికా ఖండంనుంచి తొలగించివేయవచ్చుననిరి, ఫలితం గూర్చి సందేహం లేదు గాని సులభంగా వస్తుందనుకోరాదనిరి.

#### యుద్ధ లక్ష్యం.

శత్రువుని ఎదిరించి బ్రిటిషువారును అమెరికనులును పోరాడుచు, రష్యనుల యుద్ధభారం తగ్గించగలిగినందుకు సంతసించుచున్నామనిరి. యుద్ధభారం నిరుడు కొంతమట్టుకు, యీ యేడంతాను పూర్తిగ రష్యనులే ధరించిరనిరి. "వారి దేశాన్ని వారు రక్షించుకొనుచున్నారు, మన దేశాన్ని మనం రక్షించుకొను

# సైనికులకు సదుపాయాలు.

మదరాసులోనున్న జాయింటు వారుచారిటీసు డిపో (యుద్ధానికి ధర్మకార్య సంస్థ) యుద్ధం ప్రారంభమయినప్పటినుండి సైనికులకు సదుపాయాలు చేకూర్చుచున్నది. కాని మొదటిలో వూలు కొని దుస్తులుగా అల్లి ఆఫ్రికా ప్రాంతాలకు పంపుట తప్ప ఎక్కువపని లేకుండెను. నిరుడు విదేశాలందున్న సైనికులకు క్రిస్టమసు బహుమతుల వసూలు ప్రారంభమయినాక, అనేక రకముల వస్తువులు జతచేసి పెట్టెలలో ప్యాకింగు చేసి పంపే పని ఎక్కువయింది. రేడియోలు, గ్రామఫోనులు, బిస్కట్లు, మిఠాయి యితర తినుబండారములన్నియు పంపబడుచున్నవి.

సైనికులకు యింకో సదుపాయం యిపుడు చేయబడుచున్నది. బర్మాకు పోవుచున్న సైనికులకు టీ, సోడా, కలరు, సిగరెట్లు, బిస్కట్లు, సబ్బులు యిచ్చునటువంటి హార్బరు కాంటీను ఒకటి తయారుచేయబడింది.

1942 వ సం॥ ఏప్రిలునుండి యీ ధర్మకార్యములందు క్రొత్తమార్పు కలిగెను. అపుడు మదరాసు నగరానికే ప్రమాదం చేరువయేటట్లుండెను. అందుచే, యీ నగరాన్ని రక్షించుటకు వచ్చిన సైనికులకు ఎటువంటి సదుపాయాలు చేయగలమో అన్నీ చేయవలసివచ్చెను. పైదేశాల నుండి విశేషంగా వచ్చిన సైనికులు హడావుడితో రాబట్టి ఏమీతెచ్చుకోలేదు. వారికి దేశం క్రొత్త, ఎండకాలం ప్రారంభం, అందుచే వారికిచట యీ ధర్మసంస్థయొక్క సహాయం మరీ ఎక్కువ కావలసియుండెను. కావలసిన ప్రతి వస్తువుకి కంట్రాక్టరులపై ఆధారపడి నష్టపోయేవారు.

అటువంటప్పుడు యీ సైనికులకు (వారిలో భారతీయులు బ్రిటిషువారుకూడాగలరు). సహాయం చేయుటకై గవర్నరుగారు విరాళములకై విన్నపం ప్రకటించేరు. వూరవూర తిరిగి సైనికులకు ఆహారపదార్థములను సరఫరా చేసే "సంచారపు హోటల్సు" (మొబైలు కాంటీన్సు), ప్రయివేటు సంస్థలు కొన్ని తయారుచేయగా వాటికి అధికారులు ధనసహాయం చేసిరి. సైనికుల ఉపయోగార్థం ప్రజలిచ్చే రేడియోలు, గ్రామఫోనులు, ఆట పరికరాలు మున్నగునవన్ని జాయింటు యుద్ధ ధర్మాల డిపోవారు గవర్నరుగారి మందిరంలోనే జాగర్తచేసి, దూరాన గ్రామసీమలలో మకాంచేయు సైనికులకు పంపుచున్నారు. డబ్బున్నపుడు టోకుధరను సామానులు కొని, సరసమయిన ధరలకు సైనిక దళములకు సరఫరాచేయుట, కొన్ని చిన్న వస్తువులు ఊరికే యిచ్చుట జరుగుచున్నది.

చదువుకొనేందుకు పుస్తకాలు

చదువుకునేందుకు పుస్తకాలు, గ్రామఫోను రికార్డులను నిలవచేసి యీ డిపోవారు 60 లేక

[తరువాయి 12 వ పేజీలో]

---

చున్నాము. కాని మనమంతా యింకొకందుకు—అది దేశంకన్న ప్రియమైందని నేననను—ఒకేలక్ష్యానికై పోరాడుచున్నాం. అది దేశంకన్న గొప్పది.

"అదియే స్వాతంత్ర్య న్యాయ లక్ష్యం. బలహీనులను బలవంతుల క్రౌర్యంనుండి రక్షించే లక్ష్యం. దౌర్జన్యంనుండి న్యాయాన్ని కాపాడే లక్ష్యం. పశుత్వం నిరంకుశత్వాల నెదిరించి ఔదార్యం సహనములను కాపాడే లక్ష్యం. ఈ లక్ష్యం కొరకు మనం యుద్ధం చేస్తున్నాం. క్రమేణ, కష్టంపై తప్పకుండా గొప్ప విజయమును బడయగలము.

నవంబరు నెల.

"ఇపుడే నవంబరు నెల గడిచింది. ఈ నెల సాధారణంగా మంచు చలితో చికాకుగా నుండును. కాని గడచిన నెలే నాకానందంగా నుంది. ఈ నెలలో మన వ్యవహారాలు ముందుకి సాగినవి ; మన సిపాయిలు నావికులు వైమానికులు అనేక చోట్ల గెలిచేరు ; మన మిత్రులు రష్యనులు మన శత్రువుపై తిరుగులేని దెబ్బలు కొట్టిరి ; అతి దూరంగానున్న పశిఫికు సముద్రంలో మన సోదరులును, అమెరికనులును, ఆస్ట్రేలియా న్యూజిలండులందు చేస్తున్న కృషి ఫలోన్ముఖమయింది.

"గడచిన నవంబరు నెల చాల దొడ్డది. కాని ఒక్కటి చెప్పక తప్పదు, చెప్పేనని తప్పు పట్టకండి. అదృష్టవశాత్తు వచ్చిన యీ గెలుపులు, యింకను ఘట్టిగా కృషి చేయుటకే ఉపయోగించుకోవాలిగాని, గెలిచేంకదాయని అశ్రద్ధగనుండ రాదు."

# ఈవారంలో యుద్ధ గతి

●

టునీషియాలో తీవ్రయుద్ధం - ఇటలీపై విమానదాడులు - రష్యా తిరుగుదాడి - జపాను నష్టాలు.

●

ఈ మహాయుద్ధం ప్రారంభమయి యిప్పటికి 170 వారాలు గడచింది. ఈ నెల 7 వ తేదీకి సరిగా జపాను యుద్ధంలోదిగి ఏడాదైంది. ఈ యేడాదిలో అంద రనుకున్నదానికంటే త్వరగనే అమెరికా నౌకాదళం కోలుకొని, నైరుతి పశిఫికు రంగమునందు సాలమను దీవులను తిరిగి జపాను వద్దనుండి ఆక్రమించుకో కలిగెను. గడచిన వారంలో జపానువారు యింకోసారి గొడలుకనారు దీవియందున్న తమ సేనలకు సహాయంపంప ప్రయత్నించి విఫలులైరి. కాని ఆ దీవియందున్న జపాను సేనకు యిక విముక్తిలేదు. అమెరికా సేనలు దాన్ని చుట్టివేసినవి. క్రమేపి దాని రూపు మాపగలవు. వానికి సహాయంగాపోయిన జపాను నౌకాదళమునందు 6 డిస్ట్రాయరులు, సైన్యంతోనున్న రెండు నౌకలు, ఒక సామాను నౌక దీవికి ఉత్తరాన్న యీ వారంలో జరిగిన నౌకాయుద్ధములో మునిగినవి. పాపువాయందుగూడ జపాను సేనలను మిత్రమండలి సేనలు రెండుగ విభజింపగల్గినవి. ఈ దీవులలో యిట్లుండగ, జపాను ఆక్రమించిన బర్మాలోకూడ జపాను సైన్యాల కదలిక యీవారంలో హెచ్చుగ వినబడింది. బర్మాలో రంగూనునుండి ఉత్తరాన చీనారాష్ట్రిమగు యునానుపై పోక సైనికదళం పంపినట్లును, చీనాకు ఇండియానుండి సరకు పోకుండా ఆటంకపరచుటకే యీ సైన్యం ఉద్దేశింపబడినదనియు చెప్పబడుచున్నది. ఇండియా సరిహద్దులందుగూడ ఎక్కువ సైన్యం సమీకరించి జపాను ఉంచినట్లుంది. ఆపని యిటీవల బర్మాపై మిత్రవిమానాలు ఎక్కువగ దాడులు చేయుటవలన బర్మాను రక్షించుకొనుటకే అయియుండును. బర్మాపై మిత్రవిమానాలు నిరంతరం దాడులుచేసి నష్టపెట్టుచున్న వివరాలు వేరొక వ్యాసంలో గలవు. ఈ నెల 5 వ తేదీన జపాను విమానాలు ఇండియాలోని చిటగాంగు రేవుపై దాడిచేసినవి. కాని బ్రిటిషు విమానాలు వాటిని ఎదిరించి తరిమివేసినవి. నష్టం చాలతక్కువని ప్రకటించబడెను. జపాను పశిఫికు రంగమునను, యితరచోట్లను యిటీవల హెచ్చుగ నష్టపోవుటే గాని విజయములేమి పొందలేదు.



### టునీషియా

చర్చిలు ప్రధాని గతవారం ఉపన్యాసంలో తెలిపినట్లు ఉత్తరాఫ్రికాయందు మిత్ర సేనలకు వశం కాకుండాయున్న టునీషియాయందు యింకను తీవ్రమయిన యుద్ధం జరుగుచున్నది. గత వారంలో బ్రిటిషువారి ముందుపోయిన సైన్యాలు మటూరు అను రైల్వే కూడలి స్థలమును, డిజిడేడాను ఆక్రమించినవి. మాటూర్ టూనిసు నగరానికి 30 మైళ్ల వాయవ్యంగాను, బిజార్టా రేవుకి నైరుతిగా 25 మైళ్ల దూరంలోనుంది. డిజిడేడా స్టేషను మెటూర్-టూనిసు రైలుమార్గం మధ్యలోనుంది. డిజిడేడానుండి మరికొంత ముందికి బ్రిటిషు సేనలు పోగల్గినచో శత్రుసేనల రెండు శిబిరాలకు సంపర్కం తెగియుండును. ఆ ప్రమాదం గుర్తించియే జర్మను సేనలు తీవ్ర కృషిచేసి, యీ వారంలో తిరిగి డిజిడేడాను తమవశం చేసుకొని, బ్రిటిషు సేనను 5 మైళ్ల పడమరను టెబోర్బావరకు తరిమినవి. ఇచట యిపుడు తీవ్రమగు టాంకు యుద్ధం, విమానాల యుద్ధం జరుగుచున్నవి. మెటూర్‌నుండి-టెబోర్బావరకు మిత్ర సేనలు నిలచి తమ స్థలములను రక్షించుకొనుచున్నవి. శత్రువశమునందున్న బిజార్టా టూనిసులపై బ్రిటిషు విమానాలు తీవ్రమగు దాడి జరుపుచున్నవి. టూనిసునకు నైరుతిగ 30 మైళ్ల దూరమున పాంటుడ్యూఫాఃవద్ద జర్మనులు ప్రారంభించిన ఎదురుదాడిని అచటి ఫ్రెంచి సైనికులు భగ్నము గావించిరి. టూనిసుకు వెనుకవైపునున్న విమానాశ్రయములను బ్రిటిషు సైనికులు గాలి గుమ్మటాలలోవచ్చి ఆక్రమించుకొన్నారు. బిజార్టా ట్యూనిసుల మధ్యనున్న ప్రదేశమునుగూడ మిత్రమండలి సేన లాక్రమించినట్లు వార్త వచ్చినది. కావున యీ రెండు నగరాల ముట్టడి ప్రారంభమయినట్లే.

ఉత్తరాఫ్రికాలో తూర్పున లిబియాయందు బ్రిటిషు సేనలు ఎల్‌అగేలావరకు వచ్చి అచట శత్రు రక్షణ శక్తిని పరిశోధించుచున్నవి.

### ఇటలీపై దాడులు.

ఉత్తరాఫ్రికా వశమయితే యూరోపుపై దాడి చేతుమని చర్చిలు సూచించియుండెను. ఆ పని అపుడే ప్రారంభమయినట్లున్నది. టూనిసులోని తమ సేనలకు జర్మనీనుండి సహాయంతెచ్చు నౌక

లను ముంచుటేగాక, ఇటలీపైకిగూడ మిత్ర విమానాలుపోయి ఉత్తరాన ముఖ్య పరిశ్రామిక నగరాలపైని, జర్మనీనుండి ఇటలీకి సైన్యాలు వచ్చు రైలు మార్గములందు ముఖ్య నగరాలపైని బాంబులువేసి విశేషం నష్టపరచినవి. ఇందు వలన ఇటలీలో అల్లకల్లోలమయి, నగరాలను ప్రజలు ఖాళీచేస్తున్నారు. ప్రభుత్వంపై తిరుగ బడుతున్నారనికూడ వార్తలు వచ్చినవి. నేపిల్సు రేవుపై మొదటి దాడి 4 వ తేదిన అమెరికా విమానాలు జరిపినవి. ఇటలీ రక్షణలు బలహీనంగా నున్నందున అంతకుముందే ఆ నగరాన్ని మరికొన్ని నగరాలని ప్రభుత్వంవారే ఖాళీచేయించిరి. ఈ విమాన దాడులవలన సిసిలీ దీవిలోని అక్షరాజ్య సేనలకు సప్లయిలు అందకున్నవి.

### రెండోరంగం రష్యాకు సహాయం.

ఉత్తరాఫ్రికా యుద్ధంవలనను, ఇటలీపై దాడులవలనను జర్మనీకి రెండోరంగ మేర్పడి, యిపుడు రెండు వైపుల యుద్ధం చేయవలసినస్థితి యేర్పడెను. హిట్లరు తన విమానదళంలో 1/5 వంతు రష్యా ప్రాంతాలనుండి ఉత్తరాఫ్రికాకు తేవలసివచ్చెనని ఒక బ్రిటిషు మంత్రి తెలిపియుండెను. అదివరకే ఈజిప్టు యుద్ధంలో 730 శత్రు విమానాలు నష్టమయినవి. ఈవారం బ్రిటిషు విమానాలు జర్మనీపైని, హాలండుపైని, ఫ్రాంసు పైని విమానదాడులు ఎక్కువగ జరిపి పరిశ్రమలను కెనాలులోని నౌకలను రైల్వేలను ధ్వంసం చేసినందున జర్మను విమాన ఉత్పత్తిశక్తి చాల తగ్గిపోయింది. హాలండులోని ఫిలిప్సు రేడియో కర్మాగారం ఆదివారం బ్రిటిషు బాంబరు విమానాల దాడిచే నాశనమయ్యెను. ఈ దాడులవలనను, యితర రంగాలలో శత్రుసేనలు తమ స్థానాలను రక్షించుకోవలసిన స్థితిలో పడుటవలనను, రష్యాపై ఒత్తిడి తగ్గెను. రష్యాలో స్టాలినుగ్రాడు యుద్ధరంగమునందు యీ వారం ఏమి మార్పు లేకున్నను, రష్యనుల తిరుగు దాడి తీవ్రత ఏమీ తగ్గలేదు. స్టాలినుగ్రాడు చేరువను వాల్గా డాను నదుల మధ్యనున్న 2 లక్షల 50 వేల జర్మను సైన్యం చుట్టవేయబడినది. స్టాలినుగ్రాడు నగరంలోనేయున్న రష్యను సేనకు ఉత్తరంనుండి క్రొత్తగ సహాయంవచ్చుటచే అది జర్మను సేనను నగరంనుండి వెలుపలకు నెట్టుచున్నది. ఇంకో రష్యనుసేన డాను నది మళుపులోనున్నది. జర్మనుసేనను తూర్పునకు నెట్టుచున్నది. మూడవ రష్యనుసేన నైరుతి దిక్కునుండి మీదకు తరుముచున్నది. ఇట్లు చుట్టవేయబడిన జర్మను సైన్యానికి జర్మనులు విమానాలపై సప్లయిలు పంపుచున్నారు. ఇటీవల రోస్టావు నగరంనుండి కొంత సేననుపంపి, చిక్కువడిన తమ సేనకు ఒత్తిడి తగ్గించ ప్రయత్నించుచున్నారు.

ఉత్తరాన మాస్కో రంగమునందు మాస్కోకు పడమరనున్న రెజవుపురం వద్ద జర్మనులు స్థావర మేర్పరచుకొన్నారు. ఇది స్మోలెంస్కు నగర రక్షణకు ముఖద్వారం వంటిది. ఈ నగరంనుండి జర్మనులను తరిమివేయుటకు రష్యనులు తీవ్ర కృషి చేయుచున్నారు. ఇచట భీకర యుద్ధం యిపుడు జరుగుచున్నది. స్మోలెంస్కు నగరం వశపరచుకోడానికే యీయుద్ధం స్మోలెంస్కు నగరానికి వాయవ్యంగా 75 మైళ్ల దూరం లోనున్న బియోలీవద్ద రష్యను సేనలు బ్రహ్మాండమగు తిరుగు దాడిని ప్రారంభించినవి. రెజవు నుండి వెలికిలుకిపురం వరకు 150 మైళ్ల పొడవున ఆక్రమించి, జర్మనులు శీతకాలపు రక్షణ శిబిర శ్రేణి నేర్పరచుకొనిరి. రష్యనులు తిరుగు దాడి చేసి యీశ్రేణిని మూడు సాల్లు చోట్ల చేదించగలిగిరి.

దక్షిణమున కాకసను రంగమునందు, నల్ల సముద్రతీరమున టువాప్సి వద్దనుగూడ రష్యనులు తిరుగుదాడులు ప్రారంభించి విజయం పొందుచున్నారు. ఈ విజయములు నల్లసముద్రంలోని రష్యను నౌకాదళం రక్షించుకొనుటకు సహాయకారిగ నుండగలవు

---

## సైనికుల ఆస్పత్రులకు మగ నర్సులు.

గత ఏప్రిలులో సైనిక ఆస్పత్రులకు ప్రస్తుత అవసరసమయములందు మగ నర్సులను నియమించదలచినట్లు ఇండియా ప్రభుత్వంవారు ప్రకటించిరి.

వైద్యశాఖయందు యీ ఉద్యోగులకు క్రొత్త షరతులు సౌకర్యములు ప్రభుత్వంవారు ప్రకటించుచున్నారు. వారి జీతంలో నెలకు రూ. 25 చొప్పున అడిషనలు ఎమర్జెంసీ అలవెంసు పెంచబడెను. ఇండియను మెడికలు డిపార్టుమెంటులో మగ నర్సులకు 1 వ తరగతి వారంటు ఆఫీసరుల హోదా ఒసంగబడును. ఉద్యోగంకాగానే రెండవ గ్రేడు ఆఫీసరుల ప్రయాణభత్యా మొసంగబడును.

# నవంబరులో బర్మాపై దాడులు.

## మిత్రమండలి విమానాలు రోజుకోదాడి జరుపుట.

జపాను ఆక్రమించిన బర్మాపై రాయలు విమానదళం విమానాలు అక్టోబరులోకన్న నవంబరులో ఎక్కువ దాడులు జరిపినవి. అక్టోబరులో పగలు దాడులు 13 మాత్రమే జరిపిరి. నవంబరులో 8 సార్లు పగలు, 10 సార్లు రాత్రులందు దాడివెడలి అనేక టన్నుల బాంబులు పడవేసిరి. నెల మధ్యలో రాత్రి దాడులు ప్రారంభించిరి. మీడియము బాంబరు విమానాలు అక్యాబు రేవుపైకిపోయి నౌకలపై బాంబులువేసినవి. ఆ రాత్రేగాక మరునాడు పగటివరకు దాడిచేయుచు రేవులోనున్న ఒక జపాను వర్తక నౌకను ముంచివేసి, యింకొకదానిని చెడగొట్టెను. ఆనాడే జపాను ఫైటరు విమానాలు ఎదుర్కొనగ మన బాంబరుల వెంటనున్న ఫైటరులకు బాగా పనికలిగెను. నాల్గు జపాను ఫైటరులు పడగొట్టబడెను, యింకా అనేకం చెడగొట్టబడెను. మనవి ఐదు విమానాలు పోయినవి. నేడు అకయబులోని జెట్టీ పూర్తిగ చెడియున్నది. అక్యబ్ హార్బరులో రెండు నావలు మునిగియున్నవి.

నవంబరు 17 నుండి 25 వరకు మన బాంబరు విమానాలు ప్రతిరోజు శత్రు విమానాశ్రయములపై దాడులు చేసినవి. 19 వ తేదీ మాత్రం దాడి జరుగలేదు. మింగల్దను, మాగూ, మైక్తిల, టోంగూ నగరాలపైని చేరువ ప్రాంతాలపైని దాడులు జరిగినవి. అపుడుతీసిన ఫోటోలబట్టి విమానాలు దిగేచోటులు చెడినట్లు, బాంబులు సూటిగ అనుకున్న చోటనే పడినట్లు తెలిసెను. బాంబుల వలన కలిగిన మంటలు 120 మైళ్లవరకు అగుపడుచుండెనని తిరిగివచ్చిన వైమానికులు తెలిపిరి.

పగటి దాడులందు శత్రువుల విమానాశ్రయాల పైని, రైల్వే స్టేషనులు, అనేక భవనములపైని బాంబులు వేయబడెను.

బాంబరుల వెంట కాపలాగా వెళ్లిన ఫైటరు విమానాలు కూడ చమురుటాంకుల పైని, సైనికుల మోటారులపైని, నదులపై సామానులు గొంపోవుచున్న నౌకలపైని ఫిరంగులు ప్రేల్చుచుండెను. వాటి ఫిరంగి గుండ్లచే ఒక నదియందుండిన జపాను స్టీమరు మునిగిపోయెను.

నీటిలోదిగే పెద్ద విమానాలు మామూలుగ నౌకలకు కాపలాగాపోవడం, సబుమెరైనుల కొరకు వెతకడం, వేగు తిరగడం చేస్తూ సముద్రాలపై అనేకవేల మైళ్లు పోయినవి.

అతి దూరంపోయి దాడిచేయగల వెలింగుటను రకం బాంబరులు ఇండియాలోకూడ యిపుడు పనిచేయుచున్నవి. ఇండియాలో విమానదళమునకు యివి ఒక నూతన శక్తి. ఇవి ఎక్కువ బరువు మోయగలవు, కడుదూరం పోగలవు.

### అమెరికా విమానాలు

రాయలు బ్రిటిషు విమానాలతోబాటు అమెరికను బాంబరులు బరువైనవికూడా ఇండియానుండి జరిపిన యీ దాడులందు పాల్గొన్నవి. గత నెలలో జరిగిన తొమ్మిది దాడులలో బాంగుకాకునందు జపానువారి చమురు కర్మాగారం చెడగొట్టుట ప్రధానమయినది. తాయిలాండులోనున్న చమురు కర్మాగారం యిదొక్కటే. మాండలే రైల్వే జంక్షనుపైని యార్డులలోను, అనేక టన్నుల బాంబులు వేయబడ్డవి. రంగూను నగరంపై మిత్రమండలి విమానాలు వేరువేరు తావులందు విడివిడిగ దాడి చేసినవి. బ్రిటిషు విమానాలు మింగల్దను విమానాశ్రయంపైని, అమెరికను విమానాలు రేవు స్థలము, నౌకలు, గిడ్డంగులపైని పెద్ద పెద్ద బాంబులు వేసినవి.

అమెరికా విమానాలు నవంబరులో తరుచు గస్తీ తిరుగుచు ఉపయుక్తమగు సమాచారం నందించుటేగాక, షింగుబివాంగు, మెయింగ్క్వాను లందున్న జపాను సైన్యాలపై అతి దిగువ నుండి ఫిరంగులు ప్రేల్చి పైఫాగాపైనగూడ దాడిచేసి చాల నష్టం కలిగించినవి.

శత్రు విమానాలు నవంబరులో ఇండియాపైకి అట్టే రాలేదు, బాంబులు వేయలేదు. ఒంటరివిమానాలు మాత్రం చాల మీదుగ ఎగురుచూపోయినవి.

బ్రిటిషు విమానాలు రాయలు విమానాలు కలసి సగటున రోజుకోదాడి బర్మాపై జరిపినవి. ఇండియానుండి శత్రు రాజ్యంపైని విమానదాడులు నవంబరులోనే ఎక్కువ జరిగినవి. ముమ్ముందు యింకను దూరం, యింకను యెక్కువ దాడులు జరుపగలరు.

# శత్రు నౌకను ముంచిన 7 గురు నావికులు.

## రాయలు ఇండియను నేవియందలి యిరువురు మద్రాసీలు.

హెచ్.ఎం.ఐ.ఎస్. బెంగాలు అను భారతీయ యుద్ధ నౌకను రెండు జపాను యుద్ధ నౌకలు వెంటాడగ వాటి నెదుర్కొని అందొకదాని ముంచి తప్పించుకొని యీవారం బొంబాయి రేవుకివచ్చెను. ఈ కార్యమునందు ఒక 12 పౌనుల ఫిరంగిని ఉపయోగించిన ఏడ్గురు నావికులు చూపిన ధైర్యమును తెలివి తేటలను ఎంత కొనియాడినా తీరదని నౌక ప్రధానోద్యోగితెలిపెను.

వారిపేర్లు : పెట్టీ ఆఫీసరు మహమ్మదు ఇబ్రహిం, మహమ్మదు ఖాను, ఇస్మేలు మహమ్మదు, రఘునాద సాహి, ఇస్మేలు బాబురు, పి. కె. నాయరు, బాలచంద్ర గార్లు. వీరులో ముగ్గురు బొంబాయినుండి, యిద్దరు మదరాసు నుండి యితరులు పంజాబునుండి వచ్చిరి.

మహమ్మదు ఇబ్రహింని గన్నరుమేటు అంటారు. అతను 9 సం॥ నౌకాదళమునందు పనిచేసెను. బొంబాయి రాష్ట్రీంవాడు. తన ఫిరంగి నడిపే పనివారి అనుభవంగూర్చి అత డిట్లు తెలిపెను :—

"నేను స్టారుబోర్డు మర ఫిరంగిని తుడుచుచుండగ హెచ్చరిక చేయబడెను. మేమంతా వెంటనే ఫిరంగివద్దకు పోతిమి. దూరాన్నుండి జపాను నౌకలు మావైపునకు అతివడిగ వచ్చుటగాంచితిమి. ముందుగ శత్రువులే గుండ్లు ప్రేల్చిరి. చూస్తే వా రతివడిగ మావద్దకు చేరగలరని తోచెను. అయినా నౌక కెప్టను సూటిగ శత్రు నావల్లవైపు పోయెను. ఫిరంగులు ప్రేల్చమని మాకు ఉత్తరువు చేసెను. జపానువారిపై ప్రేల్చుటకు అవకాశం దొరికినందుకు సంతసించితిమి. ప్రేల్చగల్గినంత వడిగ గుండ్లు ప్రేల్చితిమి.

"ఆరోసారి వేసిన మాగుండ్లచే శత్రువుల మందుగుండు గది కాలిపోతూవుంటే మా కపరిమితానందం కలిగెను. చాల అద్భుతంగానుండెను. ఇంకా ప్రేల్చుచుంటిమి. శత్రువుల గుండొకటి మా ఫిరంగి దిగువపడి ప్రేలెను. కొద్దిలో తప్పిపోయెను. మావారు ఏమి జరుగనట్లేయుండి ఇంకను ప్రేల్చుచుండిరి. "ఇకచాలు ప్రేల్చవద్దని" కెప్టను వుత్తరువుచేసేసరికి మాకు విచారం కలిగెను. ఇంకా ప్రేల్చ దలచితిమికాని మందుగుండు చాలలేదు. శత్రువుల నౌక మంటలలో కాలుతూవుంటే బలే సంతోషంగా నుండెను." అని మహమ్మదు ఇబ్రహిం తెలిపెను.

ప్రాణోపద్రవకరమగు పరిస్థితులలోగూడ నావికులు ఉద్యోగులు నవ్వుతాలాడుకుంటూ తమ విధి నెరవేర్చి శత్రునావను ముంచి తప్పించుకొని వచ్చిరి.

---

## "అక్కడ ఉన్న వ్యక్తి చెప్పగా విన్నాను"

అక్కడ ఉన్నాడా? నిశ్చయమేనా?
లేనిపోని పుకారులను వ్యాపింపచేయవద్దు.
అవి నష్టం, అసౌఖ్యం, సంకోచం కలిగిస్తాయి.
అమాయకులగు ప్రజలు వాటిని
వ్యాపింపచేస్తారను నమ్మకంతో
శత్రువులే వాటిని ప్రారంభిస్తారు.

* పుకారులను నమ్మకండి *

జపాన్ను ఎదుర్కొనుటకు
జాతీయ యుద్ధరంగం తయారుచేయుడు.



# యుద్ధ విమర్శ.

రష్యనుల తిరుగు దాడి మంచి కట్టుబాట్లతో జరిగినది

గత శుక్రవారం రష్యనులకు పండుగ దినం వంటిది. నిరు డీరోజున మాస్కో ముఖ్యనగరంవద్ద రష్యనులు జర్మనులను తరిమివేసే తిరుగుదాడి ప్రారంభించిరి. ఈయేడు రష్యనుల తిరుగుదాడి నిరిటికన్న మూడు వారాలు ముందు ప్రారంభమైంది. శత్రువుకి చాల నష్టం కలిగిస్తున్నది. స్టాలినుగ్రాడు నగరాన్ని ముట్టడిచేసిన శత్రుసేనలో 1,00,000 చనిపోయిరి. మూడు నెలలు ముట్టడిచేసిన పిమ్మట, పడిపోతుందనుకున్న ఆనగరంయొక్క రక్షకులు తిరుగుదాడులుచేసి తమవెనుకనుండి కొడుతున్నారని శత్రువులు తెలుసుకొనిరి. శత్రుసేనలలో మూడు డివిజనులు నాశనమయినవి.

రష్యను సేనలు ఉత్తరంనుండి ఒకటి దక్షిణంనుండి ఒకటి త్రోసుకొని వస్తున్నవి. వారిసేనలు అప్పటికప్పుడు ఏర్పడిన దళములుకావు; మంచి కట్టుదిట్టములతో బలవత్తరముగ నేర్పడి, మంచి ఆలోచనచేసి పంపబడినవి. స్టాలినుగ్రాడు నగరం ఉత్తరమును డానునది కుడివైపు గట్టుననుసరించి, అవతల వాల్గానదివరకు అడ్డంగా జర్మనులు కొన్ని శిబిరాలుకట్టి రక్షణశ్రేణి యేర్పాటుచేసిరి. ఇది చాలఘట్టిగనుండెను. స్టాలినుగ్రాడు నగర ముట్టడి చాల తీవ్రముగ నున్నపుడు, ఉత్తరమునుండి సహాయంగా రాదలచిన మార్షలు టిమోషెంకో సేనలు దీని చేధింపయత్నించి అట్టే విజయం పొందలేకపోయినవి. కాని యిపుడు తిరుగుదాడి చేసిన సేనలు ఫిరంగిదళములు టాంకుల సహాయంతో, యీశిబిరాలను చేదించి 80 మైళ్లలోపుకి రాగల్గినవి.

స్టాలినుగ్రాడు నగరానికి రోస్టోవు నగరానికి పడమరగనున్న రష్యను సేనలు అక్కడనిలువరించుకొని, యింకను పడమరను డాను నది సాగరసంగమంవరకు ఆక్రమించగల్గినచో కాకసను రాష్ట్రద్వారము హిట్లరుకి మూతపడును. ఉత్తర కాకేషియానుండి హిట్లరు దక్షిణాదివాలు కట్టుకపోవలసిందే. ఈ ప్రమాదం గుర్తించియే అతడు చాలబలమైన సైన్యాన్ని కాకససుద్వారం కాచుకొనుటకును, స్టాలినుగ్రాడు నగరంవద్ద చిక్కువడియున్న తనసేనకు సహాయంగాను పంపును. ఉత్తరభాగంలోనున్న సేనను ఎక్కువభాగం దక్షిణానికి హిట్లరు మార్చినచో, చాల దెబ్బతినును. రష్యా సైన్యాలు నిరుటివలెనే యీ యేడు చలికాలంలోగూడ తిరుగుదాడులు చాల చేయగలవని అపుడే రుజువు చేసినవి.

హిట్లరు ఓటమికి కారణాలు.

వాల్గా నదిలో నీరు అపుడే గడ్డకట్టి పడవల రాకపోకలకు మార్గం లేకుండావుంది. అందుచే దాని వొడ్డున వున్న స్టాలినుగ్రాడు నగరానికిపుడు సైనికప్రయోజనం ఏమిలేదు. అయినా యీ నగర ముట్టడికిగాను త్రోసుకొనివచ్చిన హిట్లరు, యింతనష్టపోయినా పరువుకోసం ప్రాకులాడి అచట గెలిచిన స్థానాలు యింకను నిలుపుకొనజూచునా? లేక నల్లసముద్రం ఒడ్డున యున్న రష్టవునగరంవద్దనుండి ఉత్తరాన్న వోరనెజువరకు 300 మైళ్ల పొడవు ప్రాంతం కాపాడుకొని, కాకసను మొననున్న 700 మైళ్ల మేర విడిచిపెట్టునా యన్నదే ప్రస్తుత ప్రశ్న. అతడెట్లు నిర్ణయించిన అతని సేనలకుమాత్రం చలిబాధ తప్పదు. ఆ ప్రాంతం కాపాడుటకు వారిశక్తి అంతాచాలదు. జర్మనీకి దక్షిణ, పడమర యుద్ధరంగాలందు పనికొరకుగాని, విశ్రాంతికిగాని తూర్పున రష్యారంగంలోనుండి సేనలను ఉపసంహరించుటకు అతనికి వీలుండదు.

ఈ యేడు రష్యాలో హిట్లరుకి పరాభవం జరిగిందనడానికి ఎట్టి సందేహంలేదు. రష్యనులయొక్క దేశభక్తి త్యాగం సహనశక్తుల గూర్చి తప్పు అంచనావేసెను. ఉకరైను రాష్ట్రంనుండి, కాకేషియానుండి గోధుమలు రాకుండుటచేతను చమురు బొగ్గులేక యంత్రాలు నిలచిపోవుటచేతను రష్యనులు భీరువులై, యీ చలికాలంలో వారి ఓర్పు అంతాపోయి లొంగిపోవుదురని అతడనుకొనెను. యూరోపులో యితర రాజ్యాలందు అనుభవాన్నిబట్టి, రష్యనుల ఓర్పుకికూడ ఒక పరిమితిగలదని, అది అపుడే అంతమయినదని అనుకొనెను. కాని అతని ఆలోచనలన్ని తప్పయ్యెను. రష్యను యుద్ధకృషిని అతడు నిరోధించలేకుండెను. రష్యను సేనలను నాశనం చేయలేకపోయెను. రష్యనులు సారవంతమైన స్థలములను, లోహం ఉత్పత్తి అయ్యే విలువగల

ప్రాంతాలను గోల్పోయినప్పటికి, రష్యనుల సైన్యంమాత్రం చెక్కుచెదరకుండాయుండుట మార్షలు టిమోషెంకోగారి శక్తిని చాటుచున్నది.

స్టాలిన్గ్రాడు యుద్ధం. రష్యాకు మూడు ఆధారములు

ఇపుడు స్టాలినుగ్రాడు యుద్ధం కొనసాగుచున్నది. మూడు వారాల క్రింద రష్యనులు తమ తిరుగుదాడి ప్రారంభించిరి. ఇపుడు జర్మనులు మరల దాడిచేయ ప్రారంభించుచున్నారు. అందుకై రస్టవు నగరంనుండి తమ వశమందున్న ఉత్తర కాకేషియా రైలుమార్గంమీదుగ క్రొత్త సేనలను తెచ్చుచున్నారు. స్టాలిన్గ్రాడు నగరానికి నైరుతి దిక్కున రష్యనుల స్థావరములపై జర్మనులు దాడిచేసిరి కాని చాలనష్టముతో తరిమివేయబడిరి. నగరానికి వాయవ్య దిక్కునకూడ రష్యా సేనల ఒత్తిడి తగ్గలేదు. కనుక స్టాలినుగ్రాడు, యింకను రష్యనుల నిరోధశక్తికి చిహ్నముగ నిలచియున్నది. సోవియటు రష్యా అధికారులు స్టాలినుగ్రాడు రక్షించుటకు ఎంత కష్ట నష్టాలకైనా ఓర్చితెగించదలచిరి. అది మంచిదే అయింది, హిట్లరు ఎంతేనాసరే ఆ నగరాన్ని వశపరచుకొంటానని శపధం చేసేడు. రష్యనులు తమ మహానాయకుని పేరు వహించిన ఆపురాన్ని ఎట్లయిన కాపాడాలని శపధం చేసిరి. ఈ నగరాన్ని నాజీల ఉరినుండి తప్పించడానికి మహాయుద్ధం చేయ నిశ్చయించుటకు రష్యా ప్రభుత్వం మూడు ముఖ్యవిషయాలపై ఆధారపడింది.—

1. రష్యను సైనికులు చివరవరకు నిలచి, బయటనుండి సహాయం వచ్చువరకు జర్మనులను నిరోధించి దూరాన ఉంచగలరని.

2. చలికాలం రష్యనులను ఏమి బాధించదని,

3. మధ్య రష్యాయు, ఊరలు ప్రాంతము లందు ఉత్పత్తియు, ఇంగ్లాండు అమెరికాలు పంపే ఆయుధ సామగ్రి టాంకులును తమకు శీతకాలం ముగిసేవరకు సరిపోగలవని, రష్యను అధికారులకు నమ్మకముండెను.

ఈ నమ్మకం వృధాకాలేదు. హిట్లరు ఆధారాలన్ని అయిపోయే వరకు కొనసాగించబడెను. అతని 12 డివిజనుల సేన చచ్చుటో ఖైదీలుగ పట్టుబడుటో జరిగెను. వీరుగాక గాయపడిన వారెందరో రష్యనులు తిరుగుదాడి ప్రారంభించినను హిట్లరు చాల సామగ్రి నష్టపోయెను. స్టాలినుగ్రాడు నగరాన్ని పట్టుకోవాలని వృధా యత్నం చేస్తూ కాకేసియా ద్వారంవద్ద తనకో క్రొత్త ప్రమాదం తెచ్చిపెట్టుకొనుట హిట్లరుది పొరబాటేయగును. గ్రాజ్నీ చమురు గనులను తీసుకోవాలని, అదేసమయాన నల్లసముద్రం నుండి రష్యనుల నౌకాదళాన్ని తరిమివేసి, ఆ తీరంనుండి కాకేషియా మీదుగపోయి బాకూ చమురు గనులను తీసుకోవాలని హిట్లరు ఎత్తు వేసెను. ఈ రెండు కార్యాలు - నిలిపివేయబడ్డాయి. ఈ యత్నంలో జర్మనులు పూర్తిగ ఓడిపోయే అవకాశాలేర్పడుతున్నాయి. ఎన్ని కష్ట నష్టాలైనా ఓర్చి తిరిగి కొట్టేశక్తి రష్యనుల కెక్కువగ నుండబట్టే యిది సాధ్యమయినది.

## మదరాసుయొక్క భూరి విరాళము.

చన్నరాష్ట్రమునుండి పంపబడిన సాయుధ మోటారులు మున్నగునవి అందుకొన్న సైనికోద్యోగి యీ దిగువ రీతి కృతజ్ఞత దెలిపెను :—

" మీరు దయతోపంపిన 19 సాయుధ మోటారు కారియర్లు, 5 సకవచ మోటారులను అందుకొని మా రెజిమెంటులోని సైనికులందరి తరఫున హృదయపూర్వకమగు కృతజ్ఞత తెల్పుచున్నాను. అందరు వాటిని చూసి మెచ్చుకొనిరి.

మా రెజిమెంటు మొదటి మదరాసు సైన్యములోనుండి, మదరాసు కావల్రీ అను పేరు వహించుచున్నందుకు గర్వించుచున్నది. మీ దయవలన యిపుడు మా పూర్వసంబంధం స్మరణకు వచ్చినది. ఇపుడు మా దళంలో కొన్నింటికి మదరాసు రాష్ట్రంలోని కొన్ని నంఘముల పేర్లు పెట్టి సగర్వంగా పని చేయుదుము.

జె. ఎం. హెచ్...

లెఫ్టనెంటు కర్నలు "

# హిట్లరు సాహసం - మసులోనీ ఉబ్బసం.

సామాన్యంగా అప్పులవానితోను చెప్పులవానితోను కలిసి తిరుగకూడదంటారు. ఆ మాటలో అనుభవసిద్ధమైన అర్థం కొంతలేకపోలేదు. అప్పు ఇచ్చినవానికి అప్పు పుచ్చుకొన్నటువంటివాడు లోకసహజంగా లోకువగా కన్పిస్తాడు. అప్పు పుచ్చుకొన్నటువంటి వానిని తన చేతిక్రింది తాబేదారుగానో, తన క్రింద పనిచేసే నవుకరుగానో భావిస్తూవుంటాడు. ఏదో ఒక పని ఒప్పజెప్పి చేయించుకొంటూ వుంటాడు. అప్పులవానితో కలిసి ప్రయాణంచేస్తే వానికి లొంగి వంగి సలాములుచేస్తూ వానికి సమస్తోపచారాలు చేస్తూవుండాలి. ఆవిధంగా వినయవిధేయతలతో పని చెయ్యకపోతే, తన బాకీ తనకు యిచ్చివేయవలసినదని ఒత్తిడిచేస్తాడు. కనుక, అటువంటి వానిని వెంటబెట్టుకొని తిరిగితే, చాలా అవస్థలు పడవలసివస్తుంది. హరిశ్చంద్ర మహారాజు అంతవాడు నక్షత్రకుని వెంటబెట్టుకొని తిరిగితే, ఆ మహారాజును నక్షత్రకుడు నానా అవస్థలు పెట్టాడు. చెప్పులు తొడుగుకొని నడచేటువంటివానితో కలిసి చెప్పులులేనివాడు కలిసి తిరగడం చాలా అవస్థగానే వుంటుంది. చెప్పులున్నవాడు రాళ్లరప్పలు వున్నాసరే, లక్ష్యంచెయ్యకుండా ముళ్లకంపలు పల్లేరుకాయలు వున్నాసరే, త్రొక్కుకొని నడచిపోతూ వుంటాడు. అటువంటివాని వెంట చెప్పులులేనివాడు అడ్డదోవలలో పడి నడవలేడు. సమ ఉజ్జీగా వుంటేనే సమానంగా నడక సాగుతుంది. దీనినిబట్టి బాగా ఆలోచిస్తే, ఏదైనా ఒక పెద్ద విషయం తలపెట్టినప్పుడు, ఇంకొకనితో జోడుకలిసి పనిచేయవలసినప్పుడు, ఇద్దరి తత్వం సమానంగా కలిస్తే ఆ జాయింటు వ్యవహారం సాగుతుంది. నెయ్యానికి, కయ్యానికి, వియ్యానికి సమాన హోదా, సమాన సంప్రదాయ సంస్కార వికాసం వుండాలి. సంస్కారంగాని, సరసత్వంగాని లేకుండా కేవలం మొండి సాహసం గల రౌడీతో కష్టసుఖాలు తెలిసిన సరసుడైన ఒక గృహస్థుగాని పెద్దమనిషిగాని సంస్కారిగాని ఒక పెద్ద వ్యవహారంలో జోడుగాకలిసి పనిచేస్తే, పరువు ప్రతిష్ఠలు లేనివాని సంపర్కంవల్ల అడ్డమైన గడ్డి తినవలసివస్తుంది.

మసులోనీ చదువుకొన్నవాడు. ఈ రోజున బుద్ధి పెడత్రోవల బట్టినందువల్ల ఇటలీని యుద్ధంలోకి దించినప్పటికీ, మసులోనీకిన్నీ హిట్లరుకున్నూ చాలా తారతమ్యం వుంది. మసులోని వస్తుతః సంపన్న కుటుంబీకుడు. సంసారంచేసిన గృహస్థు - విద్యావంతుడు. ఇటలీ దేశం అతి ప్రాచీనమైన రోమను చక్రవర్తులచే పరిపాలింపబడి, రోమను సామ్రాజ్యకాలంలో అఖండ వైభవం అనుభవించింది. ఐరోపా ఖండానికి న్యాయధర్మ శాస్త్రములను బోధించిన గురుపీఠం ఇటలీదేశం. అంతర్జాతీయ వ్యాపారంలో ఒకప్పుడు అందెవేసిన చెయ్యి ఇటలీవారిది. రోమను సోల్జరులు చెక్కుచెదరని ఉక్కుముక్కలని ప్రపంచ చరిత్రలో పేరు ప్రఖ్యాతులు గడించారు. ఐరోపా ఖండంలోని సంగీతసాహిత్యాలు ఇటలీలో మొట్టమొదట వికసించి, అక్కడనుండియే ఆ సంస్కార వాసనలు విస్తరించాయి. సీజరు మొదలగు రోమను చక్రవర్తులు, ఒకప్పుడు అవక్ర పరాక్రమముతో ఐరోపా ఖండాన్ని జగదేకవీరులై జయించారు. రోమను సామ్రాజ్యాన్ని నాశనంచేసిన జాతివారు జర్మనీనుంచి వచ్చి ఇటలీమీదకు దండెత్తియున్నారు. ఇటలీకి మధ్యధరా సముద్రతీరం విశేషంగావుంది. ఇటలీకి చెందిన సిసిలీ దీవి ఇటలీకి అత్యంత సమీపంగా దక్షిణంగా వుంది. సిసిలీనుంచి ఆఫ్రికా ఖండపు ఉత్తర భాగంలోకి సులభంగా పోవచ్చు. చాలాదగ్గరలోనే 100 మైళ్లలో ఆఫ్రికా ఖండం ఇటలీకి అందుబాటులో వుంది. 100 మైళ్ల సముద్రం మాత్రమే ఇటలీకి ఆఫ్రికాకు మధ్యవున్నది. ఇటువంటి చక్కని సదుపాయములు గలది ఇటలీ రాజ్యం. ద్రాక్షతోటలు ఫలవృక్షాలుగల సారవంతమైన ప్రాంతాలు ఇటలీలో వున్నాయి. ఇటలీ ప్రజలకుగల నాగరికతా సంస్కార వాసనలు, చాలా ప్రాచీనమైనవి. ప్రపంచములోని రోమను కాథలిక్కు క్రయిస్తవుల కందరికిన్ని (సనాతన పద్ధతిలోని క్రయిస్తవులందరికిన్ని) జగద్గురువైన పోపుయొక్క గురుపీఠం ఇటలీలో రోము నగరంలో వాటికాను అనుచోటవున్నది. ఇటువంటి ఇటలీదేశపు ప్రజలకు మసులోని అధిపతిగా గౌరవింపబడుతూ వున్నాడు.

హిట్లరు కేవలం బ్రహ్మచారి. సరియైన విద్యాశిక్షణ హిట్లరుకు లేనేలేదు. కేవలం కూలి పనులు చేసుకొని జీవించి, బొమ్మలు వ్రాసుకొని

## వైమానికులను రక్షిస్తే బహుమానాలు.

ఇండియా సముద్రతీరమునందు ప్రమాదవశమున పడిపోయే వైమానికులను రక్షించి సహాయం చేయువారికి బహుమతులు యివ్వబడును. పల్లెవారును, బెస్తవారును సముద్రతీరాలందు పడవలు వేసుకతిరిగే జాతులవారు, యీపనియందు తోడ్పడ కోరబడిరి.

ఇట్టి రక్షణకార్యములు చేయువారికి ప్రత్యేక వ్యక్తులకుగాని, సంస్థలకుగాని, యుద్ధకాలమునందు ధన మిస్తామని ప్రభుత్వం వారు ప్రకటించిరి.

ఈదిగువరీతి బహుమతులు స్థానిక సివిలు ఉద్యోగులద్వారా చెల్లించబడును :—

| | |
|---|---|
| ప్రాణాలతో రక్షించిన ప్రతి ఒకనికి | రూ. 100 |
| బయటకు తెచ్చిన ప్రతి శవానికి | ,, 50 |

మన విమానాలు తిరిగే సముద్రతీరం కడు విశాలమయిందగుటచే ప్రభుత్వంవారు ఏర్పాటుచేసిన సహాయ సర్వీసులకు ప్రజలు కూడ తోడ్పడినచో చాల ఉపయోగకరముగ నుండగలదు.

బ్రతికి, గత ఐరోపా సంగ్రామంలో సోల్జరుగా చేరి పనిచేసి, కాలకర్మ వశంచేత, నాజీపార్టీలో తన మొండిపట్టుదలచేత పైకివచ్చి, తన ప్రతి కక్షులనందరినీ చంపి హత్యలు చేసి, జర్మనీలో కొంతమందిని తనకు అండగాచేర్చుకొని, అధికారం సంపాదించి, గత ఐరోపా సంగ్రామములో జర్మనీ ఓడిపోయినందుకు పగ తీర్చుకోవలెననే రోషావేశంతో బుసకొట్టుతున్న హిట్లరు కాలసర్పమువంటివాడు. ఈ నాజీ సర్పమునకు విషము "తల తోక యనక యుండును" అన్నట్లుగా వున్నది. "ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ," అనేమాట హిట్లరు విషయంలో ఋజువవుతున్నది. హిట్లరుకు సంసార కష్టసుఖాలు తెలియవు. "బ్రహ్మచారీ శత మర్కటః" అన్నట్లుగా నూరు కోతులతో సమానం. ఈ చెట్టునుంచి ఆ చెట్టుకు దూకినట్లుగా, ఎటువంటి సాహస కార్యాలైనా సంకల్పిస్తాడు. ముందు వెనుకలు చూడడు. తాను సాగిస్తున్న సంగ్రామంవల్ల ఎన్ని కుటుంబాలు, ఎందరు తల్లులు, ఎందరు బిడ్డలు దిక్కుమొక్కులేని పక్షులవలె అల్లాడుచున్నారో స్వానుభవసిద్ధమైన ప్రేమానురాగాలులేని హిట్లరు కించిత్తయినా గ్రహించగలడా? అటువంటి హిట్లరు ఏవో కొన్ని ఆశలు పురిగొల్పి, మసులోనికి మహా సామ్రాజ్య పట్టాభిషేకం చేస్తానని ఆశపెట్టి, తనతోచేరి సంగ్రామానికి సిద్ధం కావలసినదని ప్రేరేపించి, దరిలేని సమరంలోకి దింపాడు. ఈ నాజీ సర్పముయొక్క మాయమాటలకు మసులోని లొంగిపోయినాడు. తన దిగ్విజయ యాత్ర క్షణికవేగంగా ముగించగలనని, హిట్లరు ప్రగల్భాలు పలికి మసులోనికి అరచేతి వైకుంఠము చూపించాడు. ఆఖరుకు మసులోనీని మహా సముద్రంలో ముంచుతున్నాడు. మసులోనియొక్క అధికారమునంతా "హుష్ మహా కాళీ" అని మటుమాయం చేసి మసిపూసి మారేడుకాయ చేస్తున్నాడు.

ఈ మహా సంగ్రామంలోనికి హిట్లరుతోకలిసి, మసులోనీ దిగినందువల్ల ఇటలీకి ప్రాప్తించిన లాభమేమిటి? లాభం లేకపోయినా, అసలుకు మోసం లేకుండావుంటే చాలుననే మనోవిచారం మసులోనీని బాధిస్తోంది. యుద్ధానికి పూర్వం ఆఫ్రికాలో అబిసీనియాను మసులోని జయించాడు. కాని, యీ యుద్ధంలో హిట్లరుతో చేరినందుకు ఫలితంగా, అబిసీనియాను వదులుకొని మసులోని తిలోదకాలు యిచ్చాడు. అంతకు పూర్వం ఆఫ్రికాలో ఇటలీకి చెందిన ఇటాలియను సోమాలిలాండుకూడా ఇప్పుడు పోయింది. అది బ్రిటిష్వారి వశమైంది. ఇరిట్రియాకూడా ఈ యుద్ధంలో ఎగిరిపోయింది. అదికూడా బ్రిటిష్వారి వశమైంది. అబిసీనియాను బ్రిటిష్వారు ఇటలీ చేతులలోనుంచి విడిపించి పూర్వపు రాజగు రాస్ టఫారీకి ఒప్పగించారు. ఇక ఉత్తరాఫ్రికాలో ఇటలీకి మిగిలియున్న లిబియాలో ముప్పాతికవంతు గత కొలది దినాలలో బ్రిటిష్వారి అష్టమసైన్యం ఆక్రమించింది. లిబియాలో ట్రిపోలిటానియా అనే పరగణా మాత్రం బ్రిటిష్ సేన ఇంకా ఆక్రమించవలసి వున్నది. కనుక ఇప్పుడు లిబియా కొనఊపిరితోవుంది.

ఇక ఉత్తరాఫ్రికా కోస్తా యావత్తూ మిత్రసేనల వశమైనతోడనే, మిత్రసేనలు సిసిలీ మీదకు దండెత్తడానికి తయారుగా వుంటాయి. అప్పుడు

ఇటలీగతి ఏమి కావాలి? ఇటలీలో బ్రిటిష్ సైన్యాలున్నూ, అమెరికను సైన్యాలున్నూ ప్రవేశిస్తే జర్మనీగతి ఏమి కావాలి. ఇటలీ సరిహద్దు దాటితే, "గోడదూకితే అదే సందు" అన్నట్లుగా కొండ దాటితే బ్రెన్నరు కనుమగుండా జర్మనీ కన్పిస్తూ వుంటుంది. అందుచేత, ఇటలీ కోస్తా ప్రాంతమంతటనూ జర్మను సేనలు కాపలాకాస్తూ వుండాలని హిట్లరు తీర్మానించాడు. తన జర్మను సేనలను ఇదివరకే శర పరంపరలుగా ఇటలీ లోకి పంపించాడు. బ్రహ్మాండమైన జర్మను సైన్యంతో ఇటలీదేశాన్ని నింపివేస్తున్నాడు. ఇటలీలోవున్న ఫ్యాక్టరీల సరకులన్నీ జర్మనీకి సమర్పించవలసినదే అని తీసికొని పోతున్నాడు. ఆ ఇటాలియను ఫ్యాక్టరీలన్నింటిలో జర్మను ఇంజనీర్లు పీరమువేసికొని కూర్చున్నారు. ఇటలీలోని పెద్ద పెద్ద ఫ్యాక్టరీల ఆసాములందరున్నూ ఈ అధికార ధూర్వహణంచూచి, "ఇదేమి అక్రమం! ఇంటిలోదూరి ఇంటివాసాలు లెక్కపెడ్తున్నాడు యీ హిట్లరు!" అని గోలపెట్టుతున్నారు. ఇటలీలో ప్రవేశించిన జర్మను లందరూ ఇంటి అల్లుళ్ల వలె షడ్రసోపేతంగా అన్నీ అనుభవించి ఆరగిస్తున్నారు. ఇటలీలోవున్న ఇటాలియను ప్రజలకు ఆహార పదార్థములు కడుపునిండని కొలత ప్రమాణంలో కొల్చి యిస్తున్నారు. ఇటలీలో రోజు 1 కి ఒక్క బంగళా దుంపకంటె ఎక్కువగా ఎవ్వనికీ సప్లయి చేయరాదని వుత్తరువు అమలు పరిచారు, జర్మనీలో జర్మను కుటుంబానికి యీ యుద్ధకాలంలో యిస్తున్న ఆహార పదార్థాలలో సగంవంతుకూడా ఇటలీలోని ఏ సంసారానికి యివ్వడంలేదు. ఇటలీలోని ప్రజలు గగ్గోలు పెట్టుతున్నారు. "ఈ యుద్ధంలో ఇంగ్లండు గెలిస్తే ఇటలీకి నష్టం, జర్మనీ గెలిస్తే ఇటలీకి సర్వ నాశనం" అనే మాట ఇటాలియను ప్రజలలో పరిపాటిగా, లోకసామెతగా చెప్పుకుంటున్నారు. ఫాసిస్టు నాయకుల ఒత్తిడి మసులోనికి ఎక్కువైంది. తన ప్రజలను తన దేశనాయకులను మసులోనీ సమాధానపరచలేకుండా వున్నాడు. మసులోనీ మనసులోని యీ వ్యాకులంతో దహించుకొని పోతున్నాడు. ఇటలీలో మసులోనీఅధికారం కొనఊపిరితో వుంది. అతని శరీరంలోకూడా జబ్బు ప్రవేశించింది. కడుపులో వ్రణమువల్ల శస్త్రం చెయ్యవలసిన అవసర మేర్పడినదనికూడా వార్తలు వచ్చాయి. వ్రణానికి కారణం రణం తప్ప వేరేమియుకాదు. మొన్న డిసంబరు 3 వ తేదిన జరిగిన ఫాసిస్టు పార్టీ నాయకుల సమావేశంలో ముస్సలోనీ వుపన్యసించాడు. ఇటాలియను నగరాలమీద బ్రిటిషు విమానాలు బాంబులు వెయ్యడంవల్ల 1,876 మంది ఇటాలియనులు మరణించారనిన్నీ, 3,300 మంది గాయపడినారనిన్ని 5,772 భవనాలు నాశనమైనాయనిన్ని దాచడానికి వీలులేక చెప్పాడు. కాని ఆ ఉపన్యాసం చెప్పినపుడు మసులోనీ దగ్గుతూ ఆయాసపడుతూ శ్రమపడి శ్వాసవిడుస్తూ వుపన్యసించాడు. స్పష్టంగా ఉబ్బసము వ్యాధి లక్షణాలు కన్పించాయి.

ఎందుకింత మనోవ్యాధి? ఎందుకింత శరీర క్లేశం? హిట్లరును నమ్ముకొని, హిట్లరు యందు విశ్వాసం ఉంచినందువల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసంకూడా ఆడకుండా ఆయాసం పడవలసిన గతి పట్టింది. పాలు పోసిపెంచిన పామునకు విశ్వాసం ఉంటుందా? హిట్లరును అనుసరించి దాసోహమ్మని లొంగి ఉంటే ఉద్ధరిస్తాడా? తన యందు నమ్మకముంచి చేతులుజోడించుకొని ఉన్న వానికి చేతికి సంకెళ్లవేస్తాడు. పాముకు ముద్దుపెట్టుకుంటే పడగనిప్పి కాటువేస్తుంది. నాజీ సర్పము పడగనిప్పి బుసకొట్టుతూఉంది. మసులోనీకి నాజీ సర్ప నిజస్వరూపం చూచినకొలదీ, అది బుస్సుమన్నకొలదీ, మసులోనికి ఉబ్బసం కూడా ప్రవేశించింది. హిట్లరుకు సాహసం ఎక్కువైనకొలదీ, మసులోనికి ఉబ్బసం ఎక్కువవుతుంది. రష్యాలో స్టాలిన్‌గ్రాడుమీదకు వెళ్లి మొండిసాహసంతో హిట్లరు నాలుగు నెలలు యుద్ధం చేసాడు. లక్షలకొలదీ సైన్యాన్ని నాశనంచేసుకొని నాజీ నాయకుడు తోక ముడతపెట్టి వెనుకకు వెళ్లాడు. లక్షోపలక్షలుగా అక్షసైన్యం నాశనమైనప్పటికి, హిట్లరు నిర్లక్ష్యంగా సాహస కార్యాలు సాగిస్తూనే ఉన్నాడు. అక్షసైన్యాలు క్షయమౌతున్నకొలదీ మసులోనికి క్షయవ్యాధి ప్రవేశించేటట్లుగా ఉంది. ఇప్పుడైనా మసులోనీకి బాగుపడేమార్గం లేకపోలేదు. హాలిఫాక్సు ప్రభువు ఇటీవల సూచించినట్లుగా, ఇటలీ స్వతంత్రంగా మిత్ర రాజ్యాలతో సంధిచేసికోవచ్చు. అసలుకు మోసంలేకుండా, మసులోనీ బాగుపడవచ్చు. ఇటలీని జటిల జర్మను నాగపాశమునుండి తప్పించవచ్చు. ఈ విధంగా చేస్తే మసులోనీ ఉబ్బసం ఒక్కదెబ్బలో చక్క

గా ఎగిరిపోతుంది. బుసకొట్టుచున్న హిట్లరు సాహసం సొంతంగా హరిస్తుంది. కాని, మనులో నీని హిట్లరు అణచివేస్తాడుగాని విడిచిపెడ్తాడా? బాగుపడనిస్తాడా? బ్రతికి మళ్లీ బట్టకట్టనిస్తాడా?

[2 వ పేజి తరువాయి]

70 మైళ్ల దూరంలోనుండు సైనికులకు పంపి మళ్లీ వసూలు చేయుచుందురు.

ఈ సంస్థయొక్క సహాయం యీ రాష్ట్రంలో నున్న సైన్యాలకు మాత్రమేకాదు; ఇతర రాష్ట్రాలందు, విదేశాలందున్న మదరాసీ సైనికులకు వారలవాటుపడిన తినువస్తువులు, వారి భాషలోని పుస్తకాలు అచట దొరకవు. కావున యీ డిపో వారు అట్టివన్ని జాగ్రత్తచేసి దూరానవున్న మదరాసీ సైనికులకు పంపుచుందురు. ఈ రాష్ట్రంలోనున్న ఉత్తర హిందూస్థానం వారికి వారి భాషలోని పుస్తకాలు, గ్రామఫోను రికార్డులు దొరుకుట కష్టముగనుంది.

ఇంగ్లాండునుండి, ఉత్తర హిందూస్థానంనుండి వస్తున్న సైనికులకు కంట్రాక్టరులవలన మోసం లేకుండా, ప్రతీ యూనిటు (సైనికదళం)లో ఒక కాంటీను ఏర్పాటుచేసి, ఆ కాంటీనుకి కావలసిన వస్తువులన్ని యుద్ధ ధర్మాల డిపోవారు సరఫరా చేయుచున్నారు. ఇందు నష్టమేమీవుండదు, కాని మదుపుకి డబ్బుకావాలి. మొత్తంపై యిట్టి పనులు చేయుచూ, యీ జాయింటు యుద్ధ ధర్మాల డిపో కేంద్రసహకార సప్లయి సంఘమువలె పనిచేయుచున్నది.

ఈ సంస్థకు చందా యిచ్చే ప్రతి అణాయు సైనికుల సహాయానికే ఖర్చగును. సంస్థయొక్క నిర్వహణ ఖర్చులు మదరాసు ప్రభుత్వంవారు భరించెదరు. సైనికులు యీ సంస్థయొక్క సహాయమును చాల మెచ్చుకొనుచున్నారు

సైనికుల ఆస్పత్రులకు గూడ యీ డిపోవారే పరికరాలొసంగి సహాయం చేయుచున్నారు. ఏ జిల్లాయైన ప్రత్యేకంగా ధనమిచ్చి ఒక ఆస్పత్రిని గాని, ఒక యూనిటుకయ్యే ఖర్చులుగాని భరించినచో, ఆ విరాళములు వస్తువులు ప్రత్యేకంగా ఆ యూనిటుకే పంపబడును. తెలుగువారు తెలుగు వారికే, మళయాళంవారు మళయాళంవారికే, తమిళులు తమిళులకే చందాలు పంపినా పంపవచ్చును; కృతజ్ఞతతో అందుకొనబడును. అని జా. యు. ధ. డిపోవారి నివేదికలో తెలుపబడెను.



# ఇచ్చటి వాస్తవ్యులు దరఖాస్తుచేయ నవసరములేదు!

జపానువారు స్వాధీనం చేసికొనిన చైనాలోని వ్యాపార ప్రపంచంలో చిన్న పెద్ద అనే తారతమ్యం లేకుండ చైనావారిని జపానువారు ఉద్యోగములనుంచి తొలగించారు. ఇప్పుడు చైనాలో చీనావారి పారిశ్రామికదారులు లేరు. చైనా షాపులూ లేవు. ఉద్యోగాల్లో చైనావారు లేరు. గుమాస్తాలు లేరు. సైపుచేయువారు లేరు. తుట్టతుదకు బజార్ల వెంబడి తిరిగి అమ్ముకొని జీవించే చైనావారుగూడ లేరు. ఇవన్నియు జపానువారి స్వాధీనమైయున్నవి. ఇవి వారికియుద్ధ ప్రతిఫలములు. జపానువారు వచ్చినప్పుడు ఇదే జరుగుతుంది.

ఇది ఇండియాలో జరుగువరకు నీవు చూస్తూ ఊరుకొనవద్దు. మన రక్షణశక్తిని బలపరచుకొని మనగెలుపు నిశ్చయమగువరకు ప్రతివ్యక్తియొక్క (స్త్రీగాని పురుషుడుగాని) సహాయ్యము చేయవలసియున్నది.



జపానువారి నెదుర్కొనుటకై దేశీయ యుద్ధరంగమును తయారు చేయుడు

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.